## వర్కింగు కమేటీవారి సంతృప్తి

బొంబాయి జన ౮

"ఏడు రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రివర్గములు యిప్పటివరకును చేసినపని చాల సంతృప్తికరముగానే యున్నది. ప్రజలకు పౌర స్వాతంత్ర్యములు నింకను హెచ్చుగా కలుగజేయుటకు, కాంగ్రెసు కార్యక్రమమును కొనసాగించుటకును మంత్రులు చేయుచున్న ప్రయత్నములుగూడ సరిగానే యున్నవి. ప్రస్తుత స్థితిలోగల చిక్కులగూర్చి ఆలోచించినచో జరిగినపని సంతృప్తికరమే యగును. మంత్రులు యిటుపైనగూడ యిట్టులనే పని చేసెదరనియు కాంగ్రెసు వారందరును మంత్రులకు తోడ్పడెదరనియు యీ సంఘమువారు గట్టిగా నమ్ముచున్నారు. ఈరీతిగా పని సరిగా జరుగుటకు స్వరాజ్య సంపాదనమునకు కాంగ్రెసు సంస్థలను బలముగా నుంచుటకును దౌర్జన్యమెంతమాత్రము పనికిరాదు అందరును అహింసాసిద్ధాంతమునే అనుసరింపవలెను. కావున దేశములో ప్రజలందరును శాంతియుతముగాను, విధేయులతోను సక్రమముగా పనిచేయుటకు కాంగ్రెసుసంఘముల వారును, కాంగ్రెసు కర్మచారులును సర్వశక్తులను వినియోగింపవలెను. అహింసా సిద్ధాంతమునకు విరుద్ధముగా కాంగ్రెసువారెవరును పనిచేయకూడదని ముందుగానే తెలియజేయవలెను. అవసరమైనచో అహింసాసిద్ధాంతమును భంగపరచిన కాంగ్రెసువారిపైని తగినచర్యను జరుపవలెను. కాంగ్రెసు మంత్రివర్గములు పౌరస్వాతంత్ర్య, ప్రజాసత్తాక సిద్ధాంతములనే అనుసరించుచుండవలెను. సాధ్యమైనంతవరకు శాంతిపద్ధతినే అవలంబింపవలెనుగాని కఠినవిధానము నవలంబించకూడదు. ఎవరైన దౌర్జన్యముచేసినపుడును, దౌర్జన్యమును ప్రోత్సాహపరచినపుడును మతకలహములు జరిగినపుడును మాత్రమే మంత్రులు కఠిన పద్ధతుల నవలంబించవలెను

### బీహారులో రైతు సంఘములు

బీహారులో రైతుసంఘముల పద్ధ్యలలో కొందరినిగూర్చి రాష్ట్రీయకాంగ్రెసు కార్యసంఘమువారు చేసినతీర్మానమును, దానిని గూర్చి వచ్చిన లెక్కలనుబట్టి రాష్ట్రీయకాంగ్రెసు కార్యసంఘమువారవలంబించిన పద్ధతి సరియైనదనియే యీసంఘమువారు నిశ్చయించిరి. రైతులు ప్రత్యేకముగా సంఘముల నేర్పరచుటకు ఎట్టి అభ్యంతరమును లేదు గాని కాంగ్రెసు ప్రధాన సిద్ధాంతములకు విరుద్ధములగు పనులలో రైతులు జోక్యము కల్పించుకొనగూడదు. కావున రైతు సంఘములలో సభ్యులుగానున్న కాంగ్రెసువారు దౌర్జన్యకరపనులను జరిగించుటలో తోడ్పడుచుండుట మిక్కిలి అనుచితము. కావున యిటుపైని ఎవరయిన నటుల చేసినచో ముందుగా తెలియజేసి రాష్ట్రీయ సంఘమువారు వారిపైని చర్య జరుపవలెను.

### కాంగ్రెసు ఎన్నికలలో దౌర్జన్యము

ఇటీవల కొన్ని రాష్ట్రములలో హరిపుర కాంగ్రెసుమహాసభ ప్రతినిధుల ఎన్నికలు జరిగినపుడు కొందరు అభ్యర్థులును దౌర్జన్యపద్ధతుల నవలంబించిరని తెలియుచున్నది ఇదిమిక్కిలి అనుచితము కావున రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములవారిట్టి అల్లరులనుగూర్చి వెంటనే విచారణచేసి అవసరమైనయెడల తగినచర్యను విధిగా జరుపవలెను

### ప్రత్తి ఉపసంఘ నివేదిక

ఈ సంఘముచే నియమింపబడిన ప్రత్తి ఉపసంఘమువారి నివేదిక చదువబడెను. ప్రపంచమునందంతటను ప్రత్తిధరలు చాల మందగించుటచే చాల విషమస్థితి యేర్పడినది. దీనివలన యిండియా దేశమునందు ప్రత్తిపంట వేయువారికందరికిని అత్యధికమగు నష్టము కలుగును అట్టి దుస్థితి కలుగకుండ చేయుటకు వెంటనే తగిన పద్ధతుల నవలంబించవలెను. దీనినిగూర్చి ఉపసంఘమువారు తగిన సూచనలను చేసియున్నారు. ఈనివేదికను భారత శాసనసభలలోను, రాష్ట్రీయ శాసనసభలలోను, కాంగ్రెసు పార్టీలకును, కాంగ్రెసు మంత్రులకును పంపవలెను. ఈనివేదికను పత్రికలలో ప్రకటింపవలెను.

## పార్టీలో చీలికలు

కైరో జన ౬

అనుకొనినటుల వఫద్‌పక్షమునందు చీలిక యేర్పడినది 3 జనవరి తేదిన జరిగిన అల్లరుల అనంతరము అహమదుమాహారు, హామీదు మహమ్మదు గారు పక్షమునుండి తొలగింపబడిరి. గత ఆక్టోబరుమాసములో పక్షమునుండి తొలగింపబడిన మహమూదు ఫెహామి నక్రాషు పాషావారలు దేశమునందు అహమదు మాహారు నాయకత్వమున స్వచ్ఛమగు వఫదుపక్ష మేర్పరచినటుల వినదగుచున్నారు. నహాసుపాషా నాయకత్వము నిరసింపబడినది

బెంగుళూరు జన ౪

కర్ణాట యువనాయకులగు యూసుఫుమెహరలీగారి ఆధ్యక్షతక్రింద ౧౬ జనవరి నాడు రాణి బెన్నూరునందు సమావేశముకానున్న ప్రథమ కర్ణాటక యువజనమహాసభ సమావేశమునకు ప్రయత్నములు తీవ్రముగా జరుగుచున్నవి. భారతనాయకులనేకు లాహ్వానింపబడినారు. శ్రీదాసప్పగారు మహాసభ ప్రారంభోత్సవము జరుపుట కంగీకరించినారు.

# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర పుష్య శు॥ ౯

సోమవారము

## హైదరాబాదునగరపు మురుగునీటి కాలువలు

మ. ఘ. వ. నిజాంప్రభుత్వమువారి అనేక శాఖల నివేదికలు ముందుకు నడచుచుండ, "హైదరాబాదునగరపు మురుగునీటి కాలువల శాఖ" యొక్క నివేదికలు ఇంకను రెండేండ్లు వెనుకబడి యున్నవి. ౧౩౪౫ ఫ.నివేదిక ౧౩౪౭ ఫ. బహమను నెలలో చేరినది. నవీన నాగరికత కనుగొన్న మార్గములచే నగరమునందు మురుగు నిలచి రోగములను పుట్టింపకుండ చేయుటకే ర్పాటులు చేయు శాఖవారు తమ పనినిగూర్చిన నివేదికలను ఆలస్యముచేయక ప్రకటించి నవీన నాగరికత లక్షణమును సంపూర్ణముగ సంరక్షించుకొనుటకు యత్నించుట అపేక్షించదగినది

నివేదన వత్సరమందు ప్రభుత్వము వారు ఈశాఖకు మంజూరు చేసిన మొత్తము రూ. ౯ లక్షలు. ఇందు రూ ౩౩౪౦౦౦ లు క్రొత్తగా మురుగు నీటిని గొంపోవు కాలువల నిర్మాణమునకును, రూ౧౬౪౦౦౦లు ప్రాతమురుగు నీటి కాలువల సంరక్షణకును, రూ. ౨ లక్షలు స్టారంవాటర్ డ్రెయినుల నిర్మాణమునకును, రూ ౨ లక్షలు సిమెంటు కాంక్రీటు రోడ్లనిర్మాణమునకును విభజింపబడెను ఇట్లు మంజూరుచేయబడిన ఖర్చు రూ ౯ లక్షలు మాత్రమే అయి యుండ, ఖర్చుచేయబడిన మొత్తము రూ ౯౬౪౩౩౭ లు అయియున్నది ఈ అదనముగ ఖర్చుచేయబడిన రూ ౬౪౩౩౭లు ౧౩౪౩ ఫ. లో మిగిలిన మొత్తముగూడ కాదు, ౧౩౪౪ ఫ. లో మంజూరు చేయబడు మొత్తములో త్రోసివేయబడునట. ఇట్టిపద్ధతిని ప్రతి శాఖయు అవలంబించుటకు ప్రారంభించినచో ప్రభుత్వ ఆర్థికవిధానమందును, సామాన్యముగ పాలనయందును చిక్కులు కలుగవచ్చును కనుక మేము యీ విధానమును ఆమోదించజాలము. ఎక్కువ ఖర్చు ప్రతి యంశముక్రిందను గలదు, క్రొత్త డ్రెయినుల నిర్మాణమునకై రూ ౪౧౭౦౬లు ప్రాత డ్రెయినులసంరక్షణకై రూ౧౪౭౭౪౪లు, "స్టారంవాటర్ డ్రెయినుల నిర్మాణమునకై రూ౨౧౦౦౯లు, నగరపురోడ్లను బాగుచేయుటకై రూ ౧౮౦౫౪౨౦లు ఖర్చుచేయబడెను. ఈ ఖర్చు అంతయుగాక, లెక్కల పరిశీలనమునకును పిన్షనులకును అయిన ఖర్చు వేఱుగానున్నట్లు చెప్పబడినది

మొత్తము పనులకైన ఖర్చులో పనివారల ప్రతిఫలములకై అయినఖర్చు రూ ౧౪౩౧౪౭లు, కేవలము పనులకై అయినఖర్చు రూ ౭౭౧౭౪౨లు. ఇట్లు కేవలము ఉద్యోగుల ప్రతిఫలములకై అయినఖర్చు మొత్తముపనులకైనఖర్చులో ప్రతిశతి ౧౯.౮ వంతున నున్నది, అనగా మంజూరు చేయబడిన ప్రతిశతి ౧౨ లెక్కకంటె ౭.౮ ఎక్కువగా నున్నది. ఇందుకు కారణము పూర్తి చేయబడిన పనులలెక్కలను పరిష్కరించుటకై ఉద్యోగులు ఉంచుకొనబడుటయు, ద్రవ్యమొసగబడనందుచే క్రొత్త పనులేవియు చేయబడకుండుటయు కారణములుగ చెప్పబడినవి. కాని మొత్తము మీద ఈశాఖ పుట్టినప్పటినుండి చేయబడిన మొత్తము పనుల ఖర్చుతో కేవలము పనివారల ప్రతిఫలముకొరకైన ఖర్చులను పోల్చిచూచి, ఇక్కడ ఉద్యోగులఖర్చు ప్రతిశతి ౯.౯౧ వంతున మాత్రమే నున్నదని నివేదిక రచయిత సంతోషమును ప్రకటించుచున్నాడు. అయినను చెప్పబడినట్టి కారణములను ఒప్పుకొనుచో, ఆఖర్చునందు వృథాత్వము కనిపించకమానదు. కావున ప్రభువువారును శాఖవారును అట్టి కారణములే ఉదయించకుండ శ్రద్ధవహించుట అవసరమే. రోడ్లపనులకును నీటి తూములపనులకును కావలసిన పనిముట్ల ఖర్చు మొత్తము ఆ పనుల ఖర్చులో ప్రతిశతి ౩.౯ వంతుననున్నదని నివేదికలో చెప్పి, ఆ పనులు పూర్తియైన తర్వాత ఆ పనిముట్ల నమ్మినచో వాటి విలువలో ప్రతిశతి ౩౦ మొదలుకొని ౪౦ వరకు తిరిగి రాబట్టుకొనవచ్చును గనుక, అప్పుడు పనిముట్లకై అయినఖర్చు పనులకైన ఖర్చులో ప్రతిశతి ౩ లెక్కకంటె తక్కువగ నుండగలదని చెప్పబడినది.

నివేదన వత్సరమందు రు ౪౪౧౧౯ ల విలువ గల సిమెంటు, రు ౨౯౭౯౦ ల విలువగల ఉక్కు, ఇనుము సామాను ఈశాఖచే కొనబడెను. ౫౫౩౧౪౧ కాంక్రీటుఇటుకలు, ౩౨౫ సిమెంటు కాంక్రీటు గొట్టములు మున్నగు ఇతర అవసరవస్తువులు ఈ శాఖ చేతనే తయారుచేసికొనబడెను. నివేదన వత్సరమందు మొదటనే చెప్పబడినటుల క్రొత్త పనులు కొద్దిగా చేయబడినవి. ౪౭౦౪౯ అడుగుల మురికినీటితూములును, ౧౧౨ "మాన్ హోలు" లును ౧౦ పాయఖానాలును, ౧౯ మూత్రపు గదులును నిర్మించబడి పురపాలకసంఘమున కప్పగించబడినవి. నివేదికసంవత్సరమందు ౬౧౭ ఇండ్లనుండి మురుగునీరు డ్రెయినేజి శాఖవారు కట్టించిన తూముల ద్వారా పోవుట కేర్పాటుచేయబడినది. ఈవిధముగా సంబంధములను కోరు ఇండ్లసంఖ్య నానాటికి వృద్ధి చెందుచున్నట్లు నివేదికలో చెప్పబడినది. ఇది పారిశుద్ధ్యమునందు నానాటికివృద్ధిచెందుచున్న ప్రజలశ్రద్ధను నిరూపించును.

నివేదనవత్సరమందు "డిస్పోజల్ వర్క్సు" ద్వారా పారిన మురుగు నీరును, వాననీరును ౧౩౪౩ ఫ. లో ౧౨౮౪౬౦౦౦౦ గ్యాలనులనుండి ౧౫ ౩౯౪౬౦౦౦౦ గ్యాలనులకు హెచ్చెను. డిస్పోజల్‌వర్క్సునుండి తీసివేయబడిన ఇసుక ౧౩౪౩ ఫ. లో ౧౫౭౩౫ ఘనపరిమాణపు టడుగులనుండి ౬౨౭౨ ఘనపరిమాణపు టడుగులకు తగ్గెను. "సెప్టిక్ టాంకు" నుండి బడుసు తీయబడలేదు. "ప్రిలిమినరీటాంకు" లోనుండి ౩౪౧౨౦ ఘనపరిమాణపు టడుగులు బురద తీయబడెను మురికికాలువలలోని మురికినీటిలో రసాయనికముగ సంయోగము చెందియున్న పదార్థములను వారమున కొకసారి డ్రెయినేజిశాఖవారి లాబొరేటరీలోనే పరిశోధించుటగలదు. అట్టి పరిశోధనలు ౧౩౪౩ఫ. లో ౨౧౦ నుండి నివేదన వత్సరములో ౨౧౨కు హెచ్చెను ఈపరిశోధనవల్ల పరిశుద్ధి చేయు యంత్రము సంతృప్తికరముగ పనిచేయుచున్నట్లు తెలిసికొనగలుగుట సంతోషకరమగు విషయము. నివేదన వత్సరములో డ్రెయినేజి నిర్మాణమంతయు అధమపక్షము మూడు నెలలకొకసారియైనను సంపూర్ణముగ శుభ్రముచేయబడుచుండెను. ఈవిధముగ మొత్తము సంవత్సరములో తీసివేయబడిన ఇసుక, బురద అంతయు ౧౩౪౩ ఫ లో ౫౯౬౭ ఘనపుటడుగుల నుండి నివేదనవత్సరములో ౪౫౧౯౭ ఘనపుటడుగు... కారణము పురపాలకసంఘపశములోనుండు మురుగుదొడ్లను శుభ్రపరచు ఉద్యోగులు సక్రమముగా పనిచేయకపోవుటయను అభిప్రాయము కలుగునట్లు నివేదికలో వ్రాయబడినది. ఈవిషయము విచారించి సరియైనపర్పాటును నిలుపుటకు పురపాలక సంఘాధికారి చర్యగైకొనునని నమ్ముచున్నాము.

మురుగునీరంతయు ఉరిబయట కొంతపొలములకు పారించబడుచున్నది. ఇట్లు సేద్యముచేయదగినభూమి ౧౧౦౩ ఎకరములున్నది. నివేదనవత్సరములో ఆబీతాబీలలో ౧౮౭౨ ఎకరములు సేద్యముచేయబడెను. దానివల్ల రూ ౨౦౩౮-౨-౦-౧ లు పన్నువచ్చెను. ఈసేద్యము చేయబడుభూమి ౧౩౪౦ఫ లో ౩౦౬ ఎకరములు మాత్రమే. ఇది అక్కడినుండి క్రమక్రమముగా హెచ్చుచు ౧౮౭౨ ఎకరములైనది. పన్నుకూడ రూ ౨౭౯౬-౬-౪ లనుండి క్రమముగా హెచ్చి రూ ౨౦౩-౨-౧ లు అయినది. ఈహెచ్చుదలచే ప్రోత్సహించబడినవారై సర్ఫెఖాసులో చేరినభూములనుకూడ దివానీయిలాకాలో చేర్చి ఈమురుగునీటిక్రింది సేద్యమును హెచ్చించుటకు శాఖవారు సూచనల జేసినారు. మురుగునీటిక్రింద తోటలను వేయు పద్ధతులు చూపుటకై ప్రభుత్వమువారు స్థాపించిన క్షేత్రములు చెరకు, పండ్లు, కూరగాయలు వేయబడినవి, దీనికైనఖర్చు ఫలితమునమ్మగా వచ్చినదానికంటె రు౩౧౦-౧-౪ లు హెచ్చుగానున్నది.

నివేదనవత్సరమందు ౧౫౭౦౮ అడుగుల పొడవుగల "స్టారంవాటర్ డ్రెయిను" లు పూర్తిచేయబడెను. నగరారోగ్యమునకు అతిముఖ్యావసరమగు ఈ నిర్మాణము ఇంకను సంపూర్ణముగ ముగియలేదు. ప్రభుత్వమువారింకను ఎక్కువ మంజూరుచేయవలెనని నివేదికలో కోరబడినది విశాలమైనసిమెంటు కాంక్రీటురోడ్డుల నిర్మాణముకూడ చాలమంచిది, నివేదన వత్సరములో ౧.౬౪ మైళ్ళసిమెంటు కాంక్రీటురోడ్లు నిర్మించబడెను. మొదట అనుకొన్న ప్రకారము పూర్తిచేయబడవలసినవి మహబూబ్‌గంజి రోడ్డులో సగము, ఖైరతాబాద్ రోడ్డులో కొద్దిభాగము, బేగం బజారురోడ్డు. నివేదికలో ఈకాంక్రీటు రోడ్లవలన మోటారులు మున్నగు బండ్లకు అరుగుడు అదురుడు మున్నగు వాటివల్ల కలుగునష్టము చాల తగ్గినదనియు, ఈ విధముగ కలిగినలాభములో కొంత భాగమును ప్రభుత్వమువారు పన్ను రూపమున రాబట్టుకొనవచ్చుననియు సూచించబడినది. అట్లు పన్ను వేయదలచినపుడు ముందుగా ప్రజాభిప్రాయము గైకొనిగాని నిర్ణయము చేయరాదని కోరుచున్నాము.

నివేదిక తుదన ఒకఅంశము గమనించదగియున్నది. మ ఘ.వ ప్రభువుగారు ౧౩౪౭ ఫ. ముగియులోపల మూసి నదిని బాగుచేయుటయు "స్టారంవాటర్ డ్రెయినుల నిర్మాణము చేయుటయు, నగరపురోడ్లను బాగుచేయుటయు పూర్తికావలెనని ఫర్మానువేఆజ్ఞాపించిరి. ఇందులకై సంవత్సరము ౧కి రూ ౧౪ లక్షలు మంజూరుచేయవలసినదని డ్రెయినేజిశాఖవారు కోరగా ౧౩౪౪ఫ. కి రూ ౯ లక్షలును, ౧౩౪౫ఫ. కి ౫ లక్షలును మాత్రమే మంజూరు చేయబడినవి దీనివల్ల మొదట చేసికొన్న పర్పాటులన్నియు తారుమారు అగుటయు, తరక్కీదు చేసికొనబడినవారలు వదలుకొనబడుటయు సంభవించినదని డ్రెయినేజిశాఖవారు మొఱపెట్టుకొనినారు. ఈ మొఱను ప్రభుత్వమువారు సంపూర్ణముగా ఆలోచించి, తగుపర్పాటు చేసియుందురని తలచుచున్నాము.

## ముహమ్మదీయులందరు వేరుగానుండినను,

## నాయకులందరు ప్రతిఘటించ ప్రయత్నించినను

# కాంగ్రెసుగౌరవమునకు లోటుకలుగదు

## అన్నాహారములులేక అల్లాడువారిని రక్షించుటయే కాంగ్రెసుఆదర్శము

ముస్లింలీగు మురిపెము

మూలానా న్యాజ ఫతేపూరి "నిగార్" సంపాదకులు

కాంగ్రెసు మహాసభ ఫైజాపూరు సమావేశానంతరము ముస్లిములను కాంగ్రెసునందేకపరచుటకు నిశ్చయింపబడుటచే ముస్లింలీగు, కాంగ్రెసు నాయకుల సంప్రతింపులవలన అన్యవిషయములేమి యేర్పడకున్నను బూటకమును, కపటమును మాత్రము గ్రహింపవీలు కలిగిన దనవచ్చును.

పండిత జవాహర్లాలు నెహ్రూగారేమన్నారు? మిస్టరు మహమ్మదాలీ జిన్నాగారి ప్రత్యుత్తరమేమి? షౌకతాలీగారు కాంగ్రెసునందు చేరుటకు నిర్ణయించిన షరతులెవ్వి? కాంగ్రెసు అంగీకరించినవెవ్వి? యనువిషయములంతగా విచారణీయములు గావు. వివేకముగల వ్యక్తి యీస్థితియందు గమనించదగినది కాంగ్రెసు వాస్తవికఆదర్శము. ముస్లింలీగు యుద్దేశము అదియే సూత్రముల ననుకరించి ఆదర్శ సాఫల్యమునకు ప్రయత్నించు చున్నది, యిది యేమిటోయనుచున్నది

ప్రపంచమందలి సర్వజాతులు, సామ్రాజ్యములు భారతదేశమందు కాంగ్రెసు మాత్రమే యొకైకబాధ్యతగల రాజకీయ సంస్థయని నిర్ణయించినవిషయము నిరాకరించుట సంభవము కాదు. భారతదేశమందలి మహమ్మదీయు లందరు యిట్టిసంస్థనుండి వేరుగానుండుటకు ప్రయత్నించినను దీని ప్రాముఖ్యత, పలుకుబడి, గౌరవమునందు అణుమాత్రమైన లోటు కలుగదనుట నిశ్చయము ఒకవేళ ముస్లింలీగు నాయకులందరు దీనిని ప్రతిఘటించి దీనిగౌరవమును భంగపరచుట కభిలషించిన అది కేవలము వారి అవివేకము. ఈమహాసంస్థనుండి విముఖులుగానుండి యేదైనా ప్రత్యేకలాభము గడించుట కాశించిన అది వారి భ్రమాజనిత వ్యామోహము.

భారతదేశము యొక్క రాజకీయములు స్వాతంత్ర్యము, సంపూర్ణ స్వరాజ్యమువరకభివృద్ధిగాంచుటయే కాంగ్రెసు ముఖ్యోద్దేశము. ఇట్టి మహోత్కృష్టాదర్శ మేర్పడియుండుటచే దేశమందు హిందువుల సంఖ్య యెంత? మహమ్మదీయులెందరు? దేవాలయములందు పూజించువారెందరు? మసీదులలో నమాజు చేయువారెందరు? అనువిషయములు కాంగ్రెసునకు అగణనీయములు. ఎందుచేతనగా నిజమైన వర్ణరహస్యములు, ముక్తిసాధనములు వేదములందు గలవా? ఖురానునందు గలవా అనుదానిని లెక్కించుట కిచ్చగించదు. కాంగ్రెసు కృషినాకర్షించిన విషయము భారతదేశమందలి ౩౫ కోట్ల ప్రాణులలో అన్నాహారములులేక అల్లాడుచున్న వారెందరు? అష్ట దరిద్రుల నెటులగాని, వారికష్ట రక్తముపీల్చి దానిపై వాడుక గడించుచున్న పరాధీనులెందరను?" ననేగలవు

నేడు దేశమందేర్పడిన యీయుపద్రవకరఘోరమెటుల అంతమొందునా యనునదియే కాంగ్రెసును బాధించుచున్న విషయము. ఈస్థితియందు కాంగ్రెసు హిందూమహమ్మదీయుల (పెరుగుతున్న) మత వైషమ్యము గుఱించిగాని, భాషానిర్ణయవిషయము గాని, ఉద్యోగముల విభజనములు గాని, గోవధగాని, విచారించుటకు సంసిద్ధముగా లేదనవచ్చును. ఉన్న గృహమే నిప్పంటుకొనుటచే లోనివారల ప్రాణములు కాపాడవలసి యున్నది. కావి యింటిలోని వస్తుసామగ్రిని రక్షించవలసిన అవసరము లేదు. ప్రాణము రక్షింపబడిన తిరిగి సముదాయము సమకూర్చవచ్చును.

ఇక ముస్లింలీగుకు భారత వర్షముతో అంతగా సంబంధములేదు. దీనిదీనత, హీనస్థితి దానికి గిట్టుటలేదు. కేవలము ౮ కోట్ల మహమ్మదీయులకు పారణ కాదు దుర్వ్యయములకు ప్రత్యేక పక్షముల సంపాదించుట కభిలషించుచున్నది కంఖారోవములకన్న అజాగ్రత్తపుని తనప్రత్యేకత్వ మస్థిరపరచుటకు ప్రయత్నించుచున్నది. ఈదేశమునందలి మహమ్మదీయులు తప్ప మిగతవారందరు అన్నాహారములు లేక మరణించిన దీనికే మమంతైన విచారము కలుగజాలదు. ఈ సంఘర్షణయందు దేశములో ఆమ్యలరాజ్యమేర్పడి స్థిరమైన యిది మిగుల సంతసించును. ఒకవేళ యీ ముస్లింలీగు వాస్తవమున భారతదేశమందలి మొత్తము మహమ్మదీయుల ప్రతినిధిగా యీ ఆపారదాస్య, స్వీయలాభ, మాకాయుష్యం మాకారోగ్యంగా, ముస్లిమేతర గొంతెమ్మకోరికలనే కోరిన కొంతవరకు సమంజసమేయనినను యనవచ్చును. కాని నేడు మహమ్మదీయ ప్రతినిధిగా ప్రపంచమంతటిని ముస్లింపార్లమెంటరీ బోర్డుపేర మోసగించుచున్న యీసంస్థతో దేశమందలి ౮ వ భాగపు మహమ్మదీయులైనను యేకీభవించకుండుట హాస్యాస్పదము. ఈసంస్థయొక్క సభ్యులలో అధికసంఖ్యాకులు మాధాచారులు, బ్రిటిషు వ్యామోహములు, జమీందారులు, తాలూక్దారులు, జాగీరుదారులు, బిరుదాంకితులు, ప్రభుత్వదాసులే. ప్రభుత్వమువారికి శక్తి లేదిపాయ మొనరించుటయే వీరి అంతరంగికోద్దేశము. ఏనాడైతే ఇప్పుడు మహమ్మదీయులను అభివృద్ధిపరచి అసమాన గౌరవమునకు పాత్రులుగాజేసెనో అట్టిది నేడామహమ్మదీయులను నీచాతినీచముగా నొనర్పుటకు ప్రయత్నించుట చారిత్రికహేయవిషయము గాదా! నేని పవిత్రనామములో, మహమ్మదీయులలో స్వాతంత్ర్యము, ధైర్యము సాహసము, శక్తి సామర్థ్యములు పుంజీభవింప జేయుచుండెనో నేడదియే దాస్యము, పిరికితన మేర్పరచుటకు సాధనమగుచున్నది.

## గృహముల దహనము

టోక్యో జన ౧

పెంటింగ్ రాజధాని నగరమందలి ౪౫౦ జపానువారి గృహములలో దహనానంతరము ౧౭ మాత్రము మిగిలినవి. అన్యగృహములను చీనావారు నాశనమొనరించిరి. ఇంతేగాక జపానువారి ప్రచారసంఘ ఆఫీసులు, కాన్సల్ జనరల్ కార్యాలయము, ఆస్పత్రి, పాఠశాల భవనములన్నియు అగ్నికాహుతి యొనరగబడినవి.

కథకులకు ఆహ్వానం:

### అఖిలాంధ్ర కథకుల సమ్మేళనము

ఫిబ్రవరి 4, 5 శుక్ర, శనివారములలో

శ్రీ తల్లావజ్ఝల శివశంకర శాస్త్రిగారి

ఆధ్వర్యమున

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున

జరుగును.

# స్వాతంత్ర్య సమర ప్రాముఖ్యత

## గృహ, ఖద్దరు పరిశ్రమలను ప్రోత్సహించవలెను

# స్త్రీల ఎడ అన్యాయముల రూపుమాపుట అవసరము

## అఖిలభారత మహిళా మహాసభలో అమృతకుమారి గంభీరోపన్యాసము

నాగపురమునందు జరిగిన అఖిలభారత మహిళా మహాసభకు ప్రారంభోత్సవము సలుపుచు రాజకుమారి అమృతకుమారిగారిట్లుపన్యసించిరి —

నేడు భారత నాట్యమందిరమున భారతస్వాతంత్ర్య సంఘర్షణా ప్రదర్శనమున కధిక ప్రాముఖ్యతగలదు. ఇది ప్రకృతిసిద్ధమైన విషయమే. స్వాతంత్ర్యమును బడయనిది భారత దేశము ఉన్నతిని చెందజాలదు. అభివృద్ధి,సంస్కరణలకు అవినాభావ సంబంధముండుటచే వానిని వేరుపరచుట అసాధ్యము. కావున ఏ పక్షమునందు చేరకయే,యేరాజకీయ పక్షీయులందు లీనము కాకుండయే దేశాభివృద్ధికరములగు ఉద్యమములందు నైతిక, ఆచరణ స్వరూపములగు ప్రయత్నములు చేయవలసిన విధి స్త్రీలపైగలదు. ఆధునిక సమస్యల పరిష్కారమునందు తమ భాగస్వామ్యమును పొందుటకు వీరి కధికారముగలదు

### నైజ భారతము

నేటివరకును మనము సేవచేసెదమని వాగ్దత్తము గావించిన మహిళా ప్రపంచముతో బాంధవ్యము కలిగించుకొనలేదను సత్యబద్ధమగు విషయముతోనే సభ్యురాలును వ్యతిరేకించదనియే నేను సంపూర్ణముగా విశ్వసించుచున్నాను మనము పట్టణములలో నివసించువారమైయుండుటయు, నైజభారతము గ్రామములలోనే యుండుటయు దీనికి ముఖ్యకారణము. ఇంతేకాక మన నిత్యజీవితమునందు మనకు(కార్య నిర్వహణము గావించలేనివర్గము) సామాజిక కార్యభారములనుండి తీరికయే గలుగుటలేదు.పాశ్చాత్య అంధానుకరణ వాతావరణము మనయందు సర్వ సాధారణముగా వ్యాపించి యుండుటచే మన జీవితములు నిరుపయోగములై పోవుటయేగాక మనకును, ఇతర సోదరీ ప్రపంచమునకును గల బాంధవ్యము విచ్ఛిన్నమై పోవుచున్నది ఈ కారణమువలనే ఆచార రాహిత్యంగను ప్రజాస్వామికము గానే యున్నను కార్యనిర్వాహకవర్గము నిజమగు ప్రజా ప్రాతినిధ్యత వహించ టలేదు.

### గృహ పరిశ్రమలు

ఒకవేళ మన నగరసంఘములు తమ నియోజకవర్గమునందుగల దేయొక గ్రామముపైన మాత్రమే తమ సంపూర్ణ శ్రద్ధను వహించి, అచటనే కొంత ప్రజాహితకార్యములైన నిర్వహించిన ప్రాముఖ్యత స్పష్టపడునని దృఢముగా మీకు విశ్వాసము గలుగజేయుచున్నాను. ఒకవేళ మనము సాధ్యమైనంతవరకు హస్తపరిశ్రమలనే వాడుకొనిన గృహపరిశ్రమలు అత్యధికముగా అభివృద్ధినొందును తన గృహమును సౌందర్యము గాను కళాశోభితముగాను నుంచుటయే స్త్రీ ముఖ్యకార్యము. సాంఘికముగా మనమందరమును గృహపరిశ్రమలను పెంపొందించెదమని శపథము గావించినాను అధిక సంఖ్యాకులగు మన సోదరీమణులు స్వదేశవస్తువులనే వాడుచున్నారని నాకు తెలిసియే యున్నను, మనము ఇంకను అత్యధిక కార్యము నెరవేర్పవలసి యున్నదనియు, దీనికి సోదరీమణులందరును ఆచరణలోనికి దేవలయునని యు కోరుచున్నాను.

### ఖద్దరు

ఖద్దరును మీరందరు ధరించవలయునని నేను మీఅందరిని హృదయపూర్వకముగా కోరుచున్నాను. మీరందరును చేనేత వస్త్ర వేదాంతమునుగూర్చి ఆలోచించుకొన గోరుచున్నాను. అయినను మీకు వానినెల, శాణ్యము, పరిశుభ్రతను మిల్లువస్త్రములతో సరిపోల్చవలెగునని మాత్రము కోరను. మీరందరును దయార్ద్రి,అవేదనా హృదయములతో ఈ వేదాంతమును పరిశీలించుమని మాత్రము వేడుచున్నాను పండిత జవాహర్లాలు నెహ్రూగారు దీనిని భారతరాజకీయ స్వాతంత్ర్యచిహ్నముగా నిర్వచించినారు మన సోదరీమణులు అధమము దీనికిపవిత్రచిహ్నమనియైనా భావించవలయునని కోరుచున్నాను ఇందువలన క్షుద్బాధితులగునట్టి, వస్త్రవిహీనులగునట్టి కోట్లమంది భారతీయులకు లాభము చేకూరుటయుండ, దోపిడీగాండ్ర దౌర్జన్యములనుండి బాధితులను సంరక్షించిన వారమగుదుము ఇంతేకాక దీనిని ధరించువారికి దాని ద్వారా మానసిక నైతికదృష్టి విస్పష్టమగును. ఒకవేళ మన శాఖాసంఘము లొకొక్కటి ఒక ఖాదీ భండారమును స్థాపించి,ఖద్దరుధారణ గావించెదమని ప్రతిన బూనినచో నేనెంతో సంతోషింతును ఖద్దరే మన సామాజిక వ్యవస్థకు సూర్యతేజమనియు దీనిచుట్టు ఇతర గ్రహములన్నియు సంచరించుచునియు గాంధీమహాత్ముడు ఆదేశించియున్నాడు

### చట్ట నిర్బంధములు

మనము చాలకాలమునుండి చట్టములవలన గలుగుచున్న యిబ్బందులను నివారణ గావించుటకై ఒకశాసనము గావింపవలయునని కోరుచున్నాము ఏడురాష్ట్రములందుగల ప్రజా ప్రభుత్వములు మన యీ కాంక్షను ఫలప్రదముగా చేయునని నమ్ముచున్నాను. కానిమనము వారికి కొన్ని అవసరసూచనలను గావించుట మన ధర్మము. కొందరు ఈ కార్యాచరణకు పూనుకొనియున్నారని తెలుపుటకు నేను సంతోషించుచున్నాను మీకు లాభదాయకమగు ఒకసూచనను నివేదించుకొనదలచుచున్నాను. ప్రస్తుత శాసనములను సంస్కరించుటకుబదులుగా వివాహము, వారసత్వము, మరి యీవిధమగు ముఖ్య సమస్యలే చేయుయుండునట్టి ఒకశాసనమును సిద్ధపరచుట అసాధ్యము గాదని నేను అభిప్రాయపడుచున్నాను. దీనిని యేజాతి అంగీకరించిన ఆజాతివారు దాని నాచరణలోనికి తెచ్చుకొనవచ్చును ఈవిధముగా మతదృష్టితో గావింపబడుచున్న అక్షేపణలనుండి మనము సురక్షితులముగా నుండుటయేగాక, ఐకమత్యమునకు సుకరమగుమార్గము చేర్పరచినవారమగుదుము.

### విద్యా సంస్కరణలు

విద్యా సంస్కరణల సమస్యనుగూర్చి మనము మొదటినుండియు నిర్బంధోచిత ప్రారంభ విద్యావిధానము నాచరణలో పెట్టవలయునని వాంఛించుచున్నాము. స్త్రీవిద్య ఉపాధ్యాయురాండ్రు లేకపోవుటచేతను, పెట్టుబడి మొత్తము లేకపోవుటచేతను చాల వెనుకబడియున్నది మన విద్యావిధానము జాతీయాచారములకు, దేశావసరములకు భిన్నముగా నుండుటయు స్త్రీవిద్యావ్యాప్తికి విరోధముగాగలదు. ఇపుడీసమస్య రాష్ట్రీయ ప్రభుత్వములవారి ఆలోచనలయందుగలదు నూతన భావములను, ఆశయములను ఐక్యపరచి ప్రశస్త విద్యా విధానము నాచరణలోనికి తేవలసిన అవసరమెం

---

# గోలకొండసంవత్సరాది సంచిక

## (వ్యవసాయక సంచిక)

మా పాఠకులకును, వ్యాసకర్తలకును, చందాదారులకును తెలుపుకొనటయేమన మేమీసంవత్సరము గతించిన మూడు సంవత్సరములందువలె యీసంవత్సరము తీసునెల ఆదిలో మాపత్రికయొక్క సంవత్సరాదిసంచిక ప్రకటించుచున్నాము. అయితే యీసంచికలో కేవలము వ్యవసాయమును గురించి మాత్రమే వ్యాసములు ప్రకటింపబడును. వ్యాసకర్తలు ఇతరవిషయములుపంపు శ్రమకుపోకుందురుగాక. పద్యములుకూడ ఎవరైన పంపిన వ్యవసాయమునకు సంబంధించినవిగా నుండిననేగాని ప్రకటింపబడవు. పాటలుకూడ వ్యవసాయ సంబంధములే పంపవలెను. సేద్యముచేయువారు, సేద్యముకూలీలు కలుపుతీయునప్పుడు, కోతలప్పుడు, కల్లముచేయునప్పుడు, మోటకొట్టునప్పుడు పాడునట్టి పాటలలో వ్యవసాయసంబంధమువి ఉండిన సేకరించిపంపిన ప్రకటింపబడును. రైతులకును, వారి కృషికిని సంబంధించిన సామెతలుకూడ కూర్చువారు కూర్చిపంపగలరు.

వ్యవసాయ సంబంధములో వ్రాయదగిన కొన్నివ్యాసములను సూచించుచున్నాము.

౧ మన మాల్గుజారీ చరిత్ర, ౨. మనమాల్గుజారీ పద్ధతికిని, బ్రిటిషుఇండియా పద్ధతికిని భేదము, ౩. బావిక్రింది సేద్యము, ౪. పారకము క్రింది సేద్యము, ఇక్కడమరి బ్రిటిషిండియాలో, ౫- గ్రామ పునర్నిర్మాణము, ౬. గ్రామ పంచాయతీలు, ౭. జాగీర్లలోని మాల్గుజారీపద్ధతి, ౮. బందోబస్తు అయిన జాగీర్లు కానిజాగీర్లు—అందలిరైతుల స్థితిగతులు. ౯. పట్టాభూములలోని చెట్లపైరైతుల కధికారమెంత—బ్రిటిషిండియాలో నెట్టిపద్ధతికలదు, ౧౦. అడవులు, అటవీశాఖాచరిత్ర, అడవులవలన రైతుల కేమేమి యిబ్బందులు, ౧౧. లోకల్ ఫండు—అదెట్లు వినియోగమగుచున్నది, బ్రిటిషిండియాలో లోకల్ బోర్డుల పద్ధతి, ౧౨. తెలంగానా భూముల పన్నులు, (ఖుష్కి,తరీ), ౧౩. తోటలు, కూరగాయలపెంపకము, ౧౪. రైతులకు సహాయపడు పరిశ్రమలు. (౧) కోళ్లపెంపకము, (౨) తేనెటీగలపెంపకము, (౩) వడకులు—నేయుట, (౪) త్రాళ్లు—వేయుట, ౧౫. పంటల అభివృద్ధి, ౧౬. పశువులవృద్ధి, వాటినిపెంచుట. వాటిరోగచికిత్సలు, ౧౭. తెలంగానాలోని సేద్యమందలి లోపములు, అవి పోగొట్టుటెట్లు? ౧౮. రైతులఅప్పు, దాని విమోచనఎట్లు, ౧౯. ఋణనివారణచట్టము, దానిఫలితము.

ఇవి కొన్ని నమూనాగా చూపబడినవి. వ్యాసకర్తలు ఈవిషయములందు శ్రద్ధతీసికొని తమ అమూల్యాభిప్రాయములను వ్రాసిపంప ప్రార్థితులు. వకీళ్లు అయినవారు మాల్గుజారీ ఖానూనుబట్టి గష్తీలనుబట్టి రైతుల కేమార్పు అవసరమో సూచింతురని మనవి.

వ్యాసములన్నియు మాకార్యాలయమున కిప్పటినుండియే పంపగలరు. నేటినుండి ఫర్వర్ది ఆఖరులోగా మాకు పంపవలెను.

సంపాదకుడు

---

# జగదీశప్రసాదు ఆగమనము

హైద్రాబాదు జన ౫

రాజప్రతినిధి ఎక్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యులగు సర్ జగదీశప్రసాదుగారు నేడుదయము నగరమునకు ప్రభుత్వాతిథులుగా గలరు. హైద్రాబాదు యందు నివసించియుండు సమయములో సర్ జగదీశుగారికిమిక్కుటముగా కార్యక్రమము యేర్పరచబడినటుల గలదు ప్రపంచవిఖ్యాతమగు అజంతా, ఎలోరా గుహల వీక్షించుటకు వీరు ఔరంగాబాదుకెళ్లి అచ్చటి నుండి బొంబాయి వెళ్లుటకు జాల్గాల్ కు వెళ్ళెదరు.

# సికింద్రాబాద నైజాం కప్పగించుట

(గోలకొండ ప్రత్యేక విలేఖరి)

కొంత కాలమునుండి సికింద్రాబాద సివిల్ యేర్యా నైజాంప్రభుత్వమువారి కప్పగించువిషయమున బ్రిటిషు, మన ప్రభుత్వములమధ్య యుత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండెను. ఈప్రాంతము నిజాంప్రభుత్వమువారి యాధీనమొనర్చుటకు పరిష్కరింప బడినటుల అనధికారరీత్యా తెలియుచున్నది. అనగా అలెగ్జాండ్రారోడునకు దక్షిణదిశయందుగల పూర్తి నగరభాగ మప్పగింపబడగలదు. ఈవిషయమున ప్రభుత్వమువారి ప్రకటన త్వరలోనే వెలువడనున్నది.

నేడు భారతదేశమున దు గొప్ప సైనికప్రదేశముగ ప్రఖ్యాతిగాంచిన యీ సికింద్రాబాద నిజాం సికందర్జాగారిపేర నామకరణ మొనరింపబడినది. క్రీ శ ౧౭౯౦ నాటియొడంబడిక ప్రకారము నైజాంగారి సౌకర్యమునకై యిక్కడ యుంచబడిన సహాయక సైన్యమునకు కలయు వ్యయము దత్తమొనర్చబడిన జిల్లాల ఆదాయమునుండి పరిపుచ్చబడెను ఇది టిప్పుపరాభవము శ్రీరంగపట్టణ మార్కమణమునకు పిదప జరిగినది

ప్రస్తుతము సికింద్రాబాద కంటోన్మెంటు ప్రదేశమునందు సికింద్రాబాద,చిలకలగూడెము, బోయినపల్లి, బేగంపేట, తిరుమలగిరి, తిరుమలగిరిపత్తరము, బొలారం ప్రాంతములందుగలవు.

# నిజాంరాష్ట్ర కర్ణాటక పరిషత్తు

గుల్బర్గాయందు జరుగును

హైద్రాబాదు జనవరి౭

నిజాంరాష్ట్ర కర్ణాటకపరిషత్తుద్వితీయమహాసభ ఆది, సోమ, మంగళ వారములందు (౧౩, ౧౪, ౧౫ ఫిబ్రవరి) గుల్బర్గా జిల్లాయందు జరుగును. శ్రీహనుమంతరావు అగ్గరిగె అహ్వానసంఘాధ్యక్షులుగా యెన్నుకొనబడిరి.

మహాసభయందు చర్చించబడుటకు తీర్మానముల బంపువారు ఫిబ్రవరి ౪ లోగా పంపవలయును.

---

తోకలదు.

జాతీయ స్వాతంత్ర్యత

మన అస్తిత్వమును సార్థకపరచుటకు యేకొంత చేయవలసియున్నది నేడు స్వాతంత్ర్య సమస్య దేశమునందు అత్యధిక ముఖ్య సమస్యగా గలదని చెప్పవలసిన అవసరములేదు ఏనాటివరకు భారతదేశము విదేశీయుల బంధనములనుండి స్వతంత్రతపొందదో అంతవరకును ఉన్నతిని పొందలేదు జీవితము విధ్వజన కొనాలదనుట సత్యబద్ధమగు విషయము విద్యాసంస్కరణలను రాజకీయ, ఆర్థిక సమస్యలతో విడదీయలేము ”

# నాంపల్లి రైల్వేస్టేషను ప్రభువుగారు ప్రారంభోత్సవము సలిపెదరు

హైద్రాబాదు జనవరి ౭

నాంపల్లి (హైద్రాబాదు)స్టేషను నూతన భవనముయొక్క ప్రారంభోత్సవము మహోత్సవకరి వహించిన శ్రీనైజాము ప్రభువుగారు సలిపెదరనియు ఈయుత్సవము ౧౪ జనవరినాడు జరుగుననియు తెలియుచున్నది.

# కనకవల్లి తాయారమ్మగారి ఆగమనము

ఆదర్శబాలికల ఉన్నతపాఠశాల ...తుసే ...సాలు

హైద్రాబాదు జ...తు.

నేడు తెనాలి నివాసినియగు శ్రీమతి కనకవల్లితాయారమ్మగారుబాలికల ఉన్నత ఆదర్శపాఠశాలకువిచ్చేసిరి. పాఠశాలాభరణమున,బాలికలచే సమావేశము జరిగినది. శ్రీమతిమాడపాటి మాణిక్యమ్మగారు తాయారమ్మగారినెరుకపరచిరి. తాయారమ్మగారుపన్యసించుచుబాలికలు జాతీయభావముగలిగియుండవలెననిఉద్బోధించిరి పిమ్మట ప్రధానోపాధ్యాయులు పాఠశాలనుగూర్చి వివరించిరి. శ్రీలాభిశెట్టి లింగన్న గుప్తగారు బాలికలకు సదుపదేశముల విచ్చిరి మంగళముతో సమావేశము ముగిసినది

శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మగారు ఉన్నత బాలికాపాఠశాలను దర్శించినప్పుడు దిగువ అభిప్రాయము నొసగిరి:—

“ నేడు ది ౪-౧-౩౮ తేదిన హైదరాబాదు బాలికల ఉన్నత పాఠశాలను చూచి ఆనంద భరితురాలనైతిని. దీనిలో ముఖ్యముగ చెప్పదగియున్నది ఉపాధ్యాయుల స్వల్పవేతనములు పుచ్చుకొని సేవచేయుటే ఆదర్శమైయున్నది. మరియు యింతవరకు ప్రభుత్వసహాయము అందకయేనను దేశయే యింతవృద్ధికి తీసుకొనివచ్చిన కార్యనిర్వాహకవర్గమువారికి కాకృతజ్ఞతను తెల్పుచున్నాను! ముఖ్యముగ మాతృభారతి అను పత్రికద్వారా ప్రపంచజ్ఞానమును బాలికలకు బోధించుట మరావహము.

ఇచట నుపాధ్యాయులు, బాలికలు యిక మీద దేశీయవస్త్రములనే వాడునట్లు చేయవలసినదిగ కార్యనిర్వాహక వర్గమువారిని హెచ్చరించుచున్నాను. మెట్రిక్ వరకు మాతృభాషలోనే హిస్టరి, జ్యాగఫీ, సైన్సులు నేర్పుచున్నందులకు వందనీయులు.

ముందు స్థాపింపబోవు నూతన కట్టడములతోపాటు బాలికలకై వసతిగృహముగూడ నిర్మింపజేయగలందులకు కార్యనిర్వాహకవర్గమువారిని ప్రార్థించుచున్నాను.

# బోసుగారి లండన్ ప్రయాణము

వెడగాస్టియన్ జన ౬

మునుపటికన్న ఆరోగ్యము చక్కగా గలదనియు, జర్మనిద్వారా వారు ౧౦ జనవరికి లండను నగరమేగుటకు నిశ్చయించినటులను, వారముకొలది అచట నివసించి విమానమునుండి స్వదేశమేగెదరని సుభాష్చంద్రబోసుగారు రూటరు విలేఖరితో చెలిపిరి.

సోఫియా జన ౬

౬ మార్చితేదిన యెన్నికలు జరుపుటకు నిశ్చయించినటుల సాబోరీకు సంతకము గల ఫర్మానా ప్రకటితమైనది సుమారు 3 సంవత్సరములనుండి రాజ్య మర్దనియంత్ర మాధీనమైయుండెను

---

# రాష్ట్రీయ వార్తలు

## భక్త్యాల జల్లాలో ౩౦౦౦ రు॥ దొంగతనము

గాలిపల్లి జనవరి ౫

౨౩-౩-౪౭ గురువారము సాయంత్రము సిరిసిల్ల తాలూకాలోని రాంపూరు నివాసియగు కోమటి సాహుకారి భార్య, బిడ్డ తలంటిపోసుకొని పొరుగువారింటికి పెట్టెలోదాచుకొనిరి. ఎప్పటివలె సాహుకారి వాటిరాత్రి భజనకు చదువుకొని పరుండెను ప్రతిదినము సాహుకారు భార్య సొమ్ములు పైకము గలిగినందున పరుండెడిది. కాని ఈనాడు ఆయన,భార్య ఇంటి వసారాలో పరుండియుండిరి. వారిద్దరుండి కన్నమునకు ఎవరు బంతిపోటు దొంగలు ఇంట్లోదూరి ఇంటివారి తలుపులు మూసిపెట్టియుండెను, దొంగవాడు శ్రేయముగా పొక్కిలి గొలుసుకుని విను.

పైకము, సొమ్ములపెట్టెలుగల ఇంట్లోదూరి అగ్గిపుల్లలుగీయను, పెట్టెలన్ని ఇంటిబయటపెట్టి పెట్టెలకు తాళములువేసియున్న ఇనుపపనిముట్లను గొలుసులోపెట్టి వెండిచెంబు బాగ బాసనములు పతకములు పూడివచ్చినది.

కోమట్లు తమసొమ్ములను పెట్టెలలో బట్టల మడుగులలో పెట్టుకొనిరి. దొంగలు బట్టలన్ని విప్పి వారెంతయు ఉపహరించిరి గాని, బట్టలు పట్టుకుని విలువగలవైనా ముట్టలేదు. బండరు హనుమంతు సుమారు నూరురూపాయలు సంచిలో బోసి నువ్వుల సంచిలో దాచిపెట్టి యుండెను. దొంగలు నువ్వులసంచిలోని నువ్వులను క్రింద నున్నపెంచి రూకల నపహరించిరి, హనుమయ్య కూతురు అగ్గడాలిక్లు ౯౦౦ ఒక వరుసలో దాచుకొని కొట్టిలో దాచుకొనెను దొంగలు వాటినిగూడ నపహరించిరి కోమటిగారలు చక్కరవడములు చేసుకొనియుండిరి దొంగలు వాటినిభక్షించి జల్లా చేసుకొనిరి ఒకచుకలో పిండిపెట్టుకొనియుండిరి. దానినికూడ నెత్తుకొనిపోయిరి. ఊరుగాయకుండలను పగుల గొట్టి ఆందేమున్నదియున్న దేమో యని వెతికిరి. నెయ్యి పెరుగుతోనిదా భోజనము చేసి వెళ్ళిరి, మొత్తము ౨౦,౩౦ తులముల బంగారు పోయినదని కోమటి చెప్పుచున్నాడు.

ఈకోమటి వడ్డివ్యాపారము చేసి జీవించువాడు, బంగారుగలను కుదువబెట్టుకొని రూపాయలు వైతులకిచ్చువాడు ఆనాడే ఒక మనిషి రూపాయలకట్టి వాగ టీలబోడు నాకివ్వనగా సాహుకారి రూకలు చెల్లించుకొని సొమ్ము లేవిచ్చేదనని బదులుచెప్పి పంపివేసెనట. ఆవాటిరాత్రే దొంగలు అన్నిసొమ్ములతో పాటు వాటినెత్తుకొని పోయిరి

పోలీసు అమీను గారు వచ్చి పంచునామా చేసుకొనిరి దొంగలను పట్టుకొనుటకు సోదా చేయుచున్నారు. మూడు తోవలు కోవచ్చెను, దొంగలు దొరకలేదు.

## నిజాంరాష్ట్ర ఆర్య వైశ్య మహాసభ

శ్రీ దంతు వెంటయ్యగారు అధ్యక్షులుగా యెన్నుకొనబడిరి

హైదరాబాదు జనవరి ౫

నేడు సాయంత్రము ౬ గంటలకు నిజాం రాష్ట్ర ప్రథమార్య వైశ్యమహాసభ ఆహ్వాన సంఘసమావేశము ఫీల్ఖానా ఆంజనేయ దేవాలయమునందు శ్రీ తేకుంట్ల వేంకటేశ్వరరావు హైకోర్టువకీలుగారి అధ్యక్షత క్రింద సమావేశమైనది హైదరాబాదు, సికిందరాబాదు తిరుమలగిరి ప్రముఖులు, ముఖ్యముగా యువకులు అధిక సంఖ్యాకులుగా పాల్గొనిరి వీరిలో శ్రీమిర్యాల రామలింగయ్య, శెట్టి జగదీశ్వరయ్య, మంచి కంటివీరయ్య (తిరుమలగిరి యువజన సంఘాధ్యక్షులు) ఒద్ది వేంకటేశ్వరగుప్తగారలు ముఖ్యులు.

మహాసభ కాచీగూడెం తుల్జాభవనమునందు ఫిబ్రవరి ౧౨-౧౩(ఫర్వర్ది ౧౧-౧౨)తేదీ శని, ఆదివారములలో జరుపబడుటకును, మహాసభాధ్యక్షులు సికిందరాబాదు పురపాలక సంఘ సభ్యులును, విఖ్యాత వైశ్య ప్రముఖులును అగు శ్రీ దంతు వెంటయ్యగారు అధ్యక్షులుగా నెన్నుకొనబడుటకును యేకగ్రీవముగా అంగీకరింపబడినది.

రాష్ట్రమందంతటను మహాసభా ప్రాముఖ్యతను ప్రబోధించుటకై శ్రీ లాభిశెట్టి లింగన్న గుప్త, జవ్వాజి సుబ్బారాయగుప్త (దక్కన్ వైశ్య పత్రికా సంపాదకులు) గారలు ప్రచారము చేయవలయునని కోరబడిరి. సభ రాగటు లకు ముగిసినది.

## గోసంరక్షణ సమితిస్థాపన

(గోలకొండ విలేఖరి)

వరంగలు జనవరి ౫

స్థానిక వైశ్యప్రముఖుల ప్రయత్న ఫలముగను వలస ౧౮ యెకరముల భూమినికొని, గోసంరక్షణాల నిర్మింపబడియుండెను. ఈశాల శ్రీ బోలెగారి పరిశీలకత్వమునందు సిద్ధపరుపబడెను. గతవారమున భూమ్యాదాయశాఖ కార్యదర్శులగు శ్రీ ఆర్.ఎం క్రాప్టన్ గారు గోశాల ప్రారంభోత్సవమును సలిపిరి ఈ గోశాలను జయప్రదముగా నిర్వహించుట స్థానిక ప్రముఖులు ముఖ్యముగా అవ్వలు తాలుక్దారులగు మౌల్వీ రహమతుల్లా వకీలుగారు కృషి గావించుచున్నారు.

శైవ మత ప్రచారము

శ్రీ ఆరాధ్య శివానందశాస్త్రిగారు సుమారు పది దినములనుండి శైవమతప్రచారము గావించుచున్నారు వైశ్యులు ఆరాధ్యులయొద్ద తప్ప బ్రాహ్మణులయొద్ద ఉపదేశము పొందగూడదనియు, అట్లు చేసినచో వారు శివద్రోహులై శివలోకము నకుకాక నరకమునకు వెళ్ళెదరనియు వీరు ప్రకటించిరి

స్థానిక వైశ్యులు గతనెల ౨౬వ తేదినాడు సమావేశమై ముందు పురాణోక్త కర్మలను విసర్జించి, వేదోక్త కర్మల నవలంబించవలెనని తీర్మానింపబడెను.

## శైవాలయ దుస్థితి

(గోలకొండ ప్రతినిధి)

భువనగిరి జనవరి ౫

గతసంవత్సర వర్షాకాలములో స్థానిక శివాలయ ప్రహరిగోడ పడిపోయెను తిరిగి కట్టించుకొనుటకు హిందూప్రముఖులు ౧౭ ఖుర్దాద్ రఖఫ తహసీలులో దరఖాస్తు నిచ్చుకొనిరి. తిరిగి ౧౫ అబాన్ రఖఫ ఉమూరె మజహబీకి యొకదరఖాస్తు పంపుకొనిరి. మాసము ౬ గడచినను అనుమతి దొరకలేదు. మళ్లీ (౯) ఇసూఫాన్ రఖఫ, డివిజన్‌లో దరఖాస్తునిచ్చిరి. ఇంతవరకును అనుమతి లభించలేదు.

గణపతి సేవ

గత నాలుగుమాసముల క్రిందట స్థానిక బాల భజనమండలివారు గణపతిసేవకై అనుమతికోరుచు నివేదించుకొన్న విజ్ఞప్తియుంకను అంగీకరింపబడలేదు. రెండు మాసముల క్రింద తహసీల్దారు గారు హిందూమహమ్మదీయ సఖ్యతకును గావించి గణపతిసేవ కనుమతినొసగవానని నొసగిరి కాని యింతవరకు అనుమతి లభించలేదు.

## పైర్ల నాశము

(ఒక విలేఖరి)

సూర్యాపేట ౨-౪-౪౭ ఫ

కాలమాన స్థితి

సమయానుకూలముగా వర్షములుపడనందున పైరులు చాలవరకునశించినవి ముఖ్యముగా పశువులకు మేతదొరకుట దుర్లభముగా నున్నది

అష్టావధానము

సత్యదుర్గకవులలో నొకరగు సత్యకవిగారిచే ౩౦వ బహమన్ దినమున సాయంత్రి అరున్నరకు గ్రంథాలయ భవనమందు అష్టావధానము జరపబడెను.

జ్వరములు

ఈ తాలూకాలో మలేరియా నిమోనియా జ్వరములు ప్రబలముగానున్నవి స్థానిక డాక్టరు గారి శ్రద్ధచే చాల మందికి నయమగుచున్నవి.

## ఆర్యవైశ్య భవన నిర్మాణము

౧౩ వందల విరాళములు వసూలగుట

బొల్లారం జనవరి ౪

"తిరుమలగిరిబజారు ఆర్యవైశ్య భవన నిర్మాణమునకు శ్రీ మంచికంటి వీరయ్యగుప్తగారు రు ౨౫౦లు శేమల లక్ష్మీనారాయణ గుప్తగారు రు ౨౫౦లు అకుల విశ్వనాథంగుప్తగారు రు ౨౫౦లు, పెద్దిరాజయ్యగారు రు ౧౫౦ లు, చౌక్కారపు విట్టయ్యగారు రు ౧౫౦లు,కొత్త నారాయణగారు రు౧౫౦లు,వేలుకుంట రామన్నగారు రు౧౦౦లు మొత్తము రు౧౩౦౦లు విరాళములొసగినారు పైమొత్తము శ్రీ శేమల లక్ష్మీనారాయణగారివద్ద యుంచబడినది." అని శ్రీ ఆల్లాడి వీరయ్యగుప్తగారు తెలుపుచు భవన నిర్మాణమునకై యితర వైశ్యప్రముఖులును సహాయము చేయవలయునని కోరుచున్నారు.

# గోలకొండ గ్రంథాలయము

## శ్రీనిజామాంధ్రీయ బహుధాన్యసంవత్సర పంచాంగము

ఇది ఎప్పటివలెనే శ్రీ దైవజ్ఞ బి వెంకటరాజేశ్వర శర్మగారిచే గుణించబడినది ఈపంచాంగము ప్రత్యేకముగ నిజాంరాష్ట్రాంధ్ర స్థానములు కలుగు తిథ్యాది భేదముల కనుగుణముగా రచింపబడినదని మరల చెప్పవలసిన అవసరములేదు దీనిప్రయోజనము పంచాంగకర్తగారిచే "శ్రీ నిజాంరాష్ట్రమునందుండు మెదకు, మహబూబునగరు, నల్లగొండ, నిజామాబాద్, వరంగల్, ఆదిలాబాదు, కరీంనగరు, హైద్రాబాదు, ఐన్నగు మండలములలో నివసించువారల కత్యంతోపయోగ పడునట్లు" ఉండుటయని చెప్పబడినది ఈసారి పంచాంగమందు ఇదివరకులేని కొన్ని విశేషములు జనుల ఉపయోగార్థము చేర్పబడినవి కాలచక్రమానములో ఇపుడు జరుగుచున్న కాలముయొక్క స్థానము ప్రాచీన సాంప్రదాయరీతి ననుసరించి తెలుపబడినది. సంవత్సరమందు జనుల కష్టసుఖములు, పైరు పంటలు, ధరలు మున్నగునవి ఎట్లుండునో ఎప్పటివలెనే చెప్పబడినవి. ఏకాదశీ నిర్ణయము, శ్రీరామనవమీ నిర్ణయము, కృష్ణాష్టమి నిర్ణయము, వినాయక చతుర్థీ నిర్ణయము మున్నగు కొన్ని పర్వదివసనిర్ణయములకు కొన్ని ప్యాఖ్యానములు చేర్చబడినవి మేషాది ద్వాదశ రాసుల జాతకఫలములు ఇందు చేర్చబడినవి, నిరుటి పంచాంగమందు లేకుండెను. ఇందు ఈసారి వివరముగా చేర్చబడిన వర్షకాల ఫలము, మాసాది ఫలములును జనులు విశేషముగా విచారించునవియే. ప్రతిరోజును ఏవేళ ఏలగ్నమెట్లు కనుగొనుటకు మార్గము చెప్పబడుటయు విరువులేని విశేషమే. పంచాంగము వలయువారు "దైవజ్ఞ బి. వెంకట రాజేశ్వరశర్మ శ్రీ నిజామాంధ్రీయపంచాంగ కార్యాలయము, శంకరంపేట జిల్లా మెదకు, తాలూకా అందోల్ గారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును. కావలసినవారు జాబుతోపాటు రెండణాల టపాస్టాంపులుపంపిన పంపిన, పంచాంగము వారి అడ్రసుకు పంపబడును.

## నవశక్తి

ఇది ప్రతిబుధవారము వెలువడు తెలుగు పత్రిక. ఇది కార్మిక కర్షకుల సంబంధములగు వార్తలకును, వ్యాసములకును ప్రకటన నొసంగుచు వారల క్షేమమును కాపాడుటకు ప్రత్యేకశ్రద్ధ వహించుచున్నది కార్మిక కర్షకుల క్షేమమే తమ ప్రధానాశయమనిఘోషించు సామ్యవాదులను సంరక్షించుటయు దీని ఉద్దేశ్యముగ నున్నట్లు మాకు పంపబడిన మొదటిసంపుటపు 3 వ సంచికలో వ్యాసముల వల్ల కనబడుచున్నది, కాని కాంగ్రెసు మహాసంస్థపై అపనిందను ప్రచారముచేయుటకు ఉద్యమించు లక్షణములు దీనియందులేవు. దీని పాలుచందా రూ 3 లు. కావలసినవారు "మేనేజర్, నవశక్తి, రాజమండ్రి" వారికి వ్రాసికొనవలెను.

## సికిందరాబాదు ఆంధ్ర ప్రముఖుల సమావేశము

అభివృద్ధి పక్షముయెడ అభిమానము ప్రకటించుట

సికిందరాబాదు జనం ౭౧

ఆంధ్రమహాసభ అభివృద్ధిపక్ష ముఖ్యులు కొందరు నేడు సికిందరాబాదునందు శ్రీ దేశేంద్రరావు బి ఏ., బి ఎల్. వకీలుగారియింట సమావేశమైన స్థానిక ప్రముఖులకు పక్షాశయములను,పక్షావసరమును వివరముగా విశదపరచిరి ఈ ప్రముఖులు పక్ష ప్రాముఖ్యతను గమనించి తామందరును పక్షమునందు సభ్యులుగా చేరెదమని తెలిపిరి

## హైదరాబాదు ఆయుర్వేద వైద్యసంఘము మహాజనసభ

హైద. జన ౨

౩౧-౧౨-౧౯౩౭ తేదీ శుక్రవారం సాయంత్రం 3 గంటలకు పై సంఘముయొక్క సార్వజనికసభ (మహాజనసభ) జరిగినది ఆసభకు డా శివవల్లభ కవిరాజ డి ఏ. వి గారు అధ్యక్షత వహించిరి.

ప్రథమమున ప్రార్థన జరిగినతర్వాత నూతనముగా వ్రాయబడిన నియమావళి చదివి అంగీకరింపబడినది. తరువాత నూతనసంవత్సరమునకు క్రొత్తగా అంగీకరించబడిన నియమావలినను సరించి కార్యనిర్వాహక వర్గము ఎన్నుకొనబడినది

అధ్యక్షులు' శ్రీ డా. శివవల్లభ, కవిరాజు డి ఎ వి. గారు, ఉపాధ్యక్షులు. శ్రీ హకీం శంకరప్రసాదు వారిగోవిందుగారు, ప్రధాన కార్యదర్శి. శ్రీ డా పి. వి ఎ ఆచార్యగారు సంయుక్త కార్యదర్శి. శ్రీ పి వి. వరదాచార్య "వైద్యభాస్కర" గారు, కోశాధ్యక్షులు శ్రీ హకీం రంగారావుగారు "వైద్యభూషణ"

అనధికారసభ్యులు పదిమంది గలరు.

శ్రీమాన్ తిరువేంకటాచార్యులుగారు ఈ సంఘపక్షమున స్థాపింపబడి సుమారొకసంవత్సరకాలము పనిచేసిన "దక్కన్ ఆయుర్వేద కళాశాల" ప్రస్తుతము నిలిపివేయబడుటకు కారణములను తెలియగోరి ఆకళాశాల మరల పునరుద్ధరించ బడెనుచో శ్రద్ధగ పనిచేయుటకు చాలమంది సిద్ధముగనున్నారనియు శ్రీయుత హకీం రంగారావుగారు ఏటటయాపాయలను ఆపాఠశాల ఖర్చులకై వ్యయము చేయుటకు దయతో ననుగ్రహింప సిద్ధముగ నున్నారనియు కనుక కళాశాలను పునరుద్ధరించుటకు ప్రయత్నములు చేయవలెనని సంఘమువారిని కోరుచున్నాననియు చెప్పిరి

వెంటనే కళాశాల నిలిపివేయబడుటకు కారణములు తత్కళాశాలా ప్రధానోపాధ్యాయులగు శ్రీ పి వి, ఎ ఆచార్యగారు వివరముగా సభ్యులకుచెప్పి మరల పునరుద్ధరింప ప్రయత్నములు చేయుట ధర్మమనియు అందునకు తామునూడ సిద్ధముగానున్నామనియు చెప్పిరి

అందుమీద ఈవిషయమై ఆలోచించి రాబోవు కార్యనిర్వాహక వర్గ సమావేశములో తమనివేదికను అందజేయవలెనని గోరుచు ౫ గురు సభ్యులుగల ఉపసంఘము ఏర్పరుపబడినది

పాఠశాలా నిర్వాహకసమితియొక్క కార్యదర్శిగారికి సహాయకులుగా పనిచేయుటకు డా నారికిషన్ గారిని సహాయ కార్యదర్శిగా ఎన్నుకొనిరి.

## ప్రభువుగారి ఔదార్యము

హైద్రాబాద జన ౪

డాక్టరు సర్ మహమ్మదు ఎక్బాలు గారికి ౧౦౦౦ రూప్యములు ప్రభువిరాళ్యముగా నొసగబడినవి

మిరియంబీ యను స్త్రీకి జీవితాంతము వరకు నెలకు రు౧౦ల యుపకార వేతన మొసగబడినది పూర్వపు సదర్ మొహతమిం తిజారత్ యూసానిగారి కూతురికి నెలకు రు౫౦ల యుపకారవేతన మొసగుట కంగీకరింపబడినది.



## ఆయుర్వేద పరిశోధన ప్రణాళిక

ఆంధ్ర ఆయుర్వేద మహాసభా స్థాయిసంఘము ఉపసంఘముస్థాపించుట

నిజాంరాష్ట్ర ఆంధ్ర ఆయుర్వేదమహాసభ స్థాయిసంఘ కార్యదర్శిగారిట్లు వ్రాయుచున్నారు.—

౩౧-౧౨-౩౭ వ తేదీ శుక్రవారముసాయంత్రం ౬ గంటలకు ఆంధ్ర ఆయుర్వేద మహాసభా స్థాయిసంఘ కార్యనిర్వాహక సంఘము శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన నిజాం ఆయుర్వేద సదర్ దవాఖానవారి భవనమునందు సమావేశమై కొన్ని అవసర విషయములను చర్చించినది.

స్థాయిసంఘ కార్యాలయము నిజాం ఆయుర్వేద సదర్ దవాఖానాయందేర్పరచుటకు నిర్ణయించబడినది. గనుక ఉత్తర ప్రత్యుత్తరములను జరుపదలచువారు "కార్యదర్శి, ఆంధ్ర ఆయుర్వేదమహాసభా స్థాయిసంఘ కార్యాలయము, నిజాం ఆయుర్వేద సదర్ దవాఖాన, సుల్తాన్ బజారు, హైదరాబాదు దక్కన్" అని వ్రాయవలెను.

ఆయుర్వేద మహాసభా సభ్యులుగ చేరదలచువారు ౮ అణాలు చెల్లించవలెను గనుక ఆయుర్వేదాభిమానులందరును మహాసభా సభ్యులుగ చేరవలెనని కోరుచున్నారు.

విద్వత్పరిషత్తుయొక్క కార్యప్రణాళికను ఆలోచించి తయారుచేసి రాబోవు కార్యనిర్వాహకవర్గ సమావేశము నాటికందజేయుటకుగాను ఈ క్రింది సభ్యులతో కూడుకొనిన ఉపసంఘము ఎన్నుకొనబడినది.

౧ అధ్యక్షులు, ౨ కార్యదర్శులు, ౩ పండిత రాధాకృష్ణశర్మ, ౪ వే. రా అవధాని ౫. పండిత వేంకటాచార్యులవారు. ఇక కొన్ని తీర్మానములు చేసిన యనంతరము సమావేశము ముగింపబడినది.

## ఊరుమార్చికట్టుటకై క్రాఫ్టన్ గారి సూచన

తమకు శక్తిలేదని రైతులనుట

పాలకంచ జనవరి ౪

భూమ్యాదాయశాఖకార్యదర్శియగు క్రాఫ్టన్ గారు సతీయుతులై పాలకంచకు ౨౧ బహమన్ తేదీన దయచేసిరి. సరిహద్దు వద్ద మసూసావ ఆటవీ పరీశిలనాధికారి వారికి పూలహారములువేసిరి. క్రాఫ్టన్ దంపతులు దుమ్ముగూడెంపల్లి రాత్రి యచ్చటికివచ్చి మకాంచేసిరి. ఉదయమే వారు స్వయముగా గ్రామము తిరిగి చూచిరి. ౧౧ గంటలకు పులిచేటకు వెళ్లికాని పులి వేటకాలేక రాలేదు. ౨౩ తేదీఉదయమే బూర్గంపహాడుకు వెళ్లివచ్చి,తరువరసింగభూపాలకు వెళ్లి మధ్యాహ్నం ౨ గంటలకువచ్చిరి ౨౪ తేదీఉదయమునకే యీసంస్థానపు కచహేరీలు నిర్మించు ప్రదేశమునుమాచి రైతులను పిలిపించి ఊరు చాలలోతుప్రదేశమందున్నది. నీరు పారుదలవలన జబ్బులు కలుగుచున్నవి. ఎత్తైన ప్రదేశముపైన చోటు చూపించెదము. ఊరు మార్చి కట్టుకలసిదిగా సెలవిచ్చిరి రైతులు తనబీదతనమువలన ప్రస్తుతము కట్టలేమనివనవి చేసిరి క్రాఫ్టన్ గారుకొదుటలో ౨౪-౩ ౪౭ సింగరేని కాలరీసుకు వెళ్లిరి

## ఆంధ్రసాహిత్య పరిషత్తు

(కాకినాడ)

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములగు గ్రంథములను శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువుతప్ప మిగిలినయన్నింటిని పరిషత్పత్రిక వెనుకటి సంచికలతోగూడ ఆంగ్ల సంవత్సరాది (ది 1 జనవరి 1938) మొదలు ఆంధ్రసంవత్సరాది (బహుధాన్య సంవత్సర చైత్ర శు॥ ౧ ది 1 ఏప్రిల్ 1938) వరకు సగమువెల కీయబడును. కావున దరుణమును మించబెట్టక రాష్ట్రాభిమానులెల్లరు త్వరపడి పరిషత్తునకు సహాయము చేయగోరబడుచున్నారు.

పుస్తకముల పట్టికకై వ్రాయుడు —

మేనేజరు





# యిష్తెహారు

## మహకమా నజామతు ఆబుకారి ముమాలికు మహరూస సర్కారుఆలీ

నెం॥ ౭ బహమన్ సన్న ౧౩౪౭ సా

నిషాన్ మిసల్ నిజామతు ౨౪ నేగ జాగీరాతు ౫౩ సన్ ౧౩౪౭ సా॥

## మొకద్దమా

యిష్తెహారు అదాయి అక్సాతునే మాహీ అవ్వల్ సన్ ౧౩౪౭ సాల్లు బాబతు అమదని శేంది జాగీరాతు.

జాగీరాతు వ మవుజా మఖ్తాల అమదనిశేంది సేమాహీ అవ్వల్ సన్ ౧౩౪౭ సాలు కిస్తుయొక్క అదాయి తా॥౬ యిస్ఫందారు సన్న ౧౩౪౭ సాలు నుంచి అమల్ లో రాగలదు. చెక్కులతక్సీము ౬ యిస్ఫందారు సన్న ౧౩౪౭ సాలు శని వారమునుంచి ౧౧ యిస్ఫందారు గురువారమువరకు యీ మహకమానుంచి అవుతూవుండగలదు. యే జాగీరుదార్లు అయితే చెక్కులు తీసుకోగలందుకు స్వంతముగ రాజలరో వారలు తమ కారు పరదాజులజర్యాన తెప్పించుకోజాలుదురు ఫక్తు.

హాసుబె మస్విదా దస్తఖత్ ఆలీ జనాబు నాజంసాహెబు బహద్దరు.

దస్తఖత్ మదదుగారు నాజం

